తే. వృత్తవంతుడు వెండియు ♦ వివిధగతుల
విత్తవంతుడుగా నేర్చు ♦ వృత్త హీను
డైన వాడు విహీనుండ ♦ యండ్రు గాన
విత్తరక్షకు గడుమేలు ♦ వృత్తరక్ష. (అరణ్యపర్వము.)

గీ. అనఘ యాచార మాయువు ♦ బెనుచు నదియ
కాదు శ్రీయును కీర్తియు ♦ నలుగ జేయు
విను దురాచారు డాయువు ♦ పెనువు పొంద
డతని నఖిల భూతంబులు ♦ నభిభవించు.

క. కావున నాచార పరత
భూవరమేల్ సాధుజనులు ♦ వోవు తెరవు సం
భావించుట యాచారము
డావర్ణాశ్రమననురక్షితం బరగునృపా. అనుశాసనీకము.

క. వర్ణాశ్రమ ధర్మంబుల
నిర్ణయమును వదిలి వేద ♦ నిందకు లైదు
ర్వర్ణుల గూడిన వారల
వర్ణనమిపుడేలపుత్రదారల యోగుల్. బ్రహ్మాండపురాణం

చ. అనుటయు నాతడిట్టులను ♦ నక్కురు భర్తకు వేగమేటికిఁ
ఘనభుజ యెల్లచంద్రములు ♦ గాలము తోడివచుమ్ము వర్ణ ధ
ర్మనిరతి చిత్తపాకము క్రి ♦ మంబున దెచ్చు కషాయ పక్వతం
బనుపడ కర్ష్మ డేలగు నృ ♦ పాల కుమారుడు సన్యసింపగఁ.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోషమపినత్యజేత్
సర్వారంభాహి దోషేణధూమేనాగ్నిరివావృతాః॥

తా. తన జాతికి సహజ సిద్ధంబైన కర్మదోషముండినను దా
నిని త్యజింపరాదు అగ్నిని పొగ చుట్టుకొని యుండు రీతిగా సమస్త
కర్మలును దోషముచేత నావరింపబడి యుండును.

(భగవద్గీత మోక్షసన్యాస యోగము.)

## 57. సర్వవర్ణములు ఆచరించవలసిన యాచారములు.

క. పరధన పరదారంబుల
హారియింపమి దేవ పితృ స ♦ మారాధనముఁ
గరుణయు నతిథిసపర్యయు
గిరితనయా యెల్లవారి ♦ కిఁ గృత్యంబుల్.

గీ. అన్యమాంసమున ని ♦ జాంగ మాంసమ్ము బో
షింతు ననుటకంటె ♦ చెడ్డ లేదు
మాంసభక్షణంబు ♦ మానుటకంటెను
మేలు లేదు కర్మ ♦ జాలకమున. (భాగవతము.)

గీ. వినుము దానంబు తపమును ♦ వృద్ధసేవ
నము నహింసయు నియత కృ ♦ త్యములు సర్వ
జనులకు మహాగుణమ్ములు ♦ మనమునందు
దృఢమ్ముగా నిల్పి నడువుము ♦ ధీరవర్య.

క. విమలాత్మ యహింసయు దా
నమ్ము సత్యమ్ము గో ♦ ధవర్జ ♦ నంబును వినుము
త్తమ ధర్మరాశి యిది ధ
ర్మమునకు బరసీమ దీని ♦ మరువుము మదిలోన్.
(భారతము.)

క. ఇనుమును కనకము నిందయు
వినుతియు సమములుగ గనుచు ♦ వివిధాంగకముల్
తనలోన నడచుకమఠము
ననువున నింద్రియములడచు ♦ నతడు శివుగనున్.

క. కులమ్మును విద్యయు వృత్తము
నమలమ్ముతి యున్నమిద్దుట ♦ నైకెయ్యుదుగంగా
వలవదు విప్రుని నాదర
మలరంగానిడుట లెస్స ♦ యడిగినమాత్రన్. అనుశాసనీకం.

క. కోరిక నొల్లమి లేకయు
మేరూపున భూతములకు ♦ నెగ్గగు తెరగుం
జేరక యకామవృత్తి త
పోరతి నున్నతడు బ్రహ్మ ♦ మున్ ప్రాపించున్.

గీ. సర్వవర్ణాశ్రమములకు ♦ శమముదమము
గలిగి యునికి విశిష్ట ప్ర ♦ కారమగుట
బ్రాహ్మణునకు విశేషించి ♦ రాజవర్య
దమ సమాహిత వృత్తి పై ♦ ద్దయును వలయు.

క. సమదర్శినుడై యఖిల భూ
తములను దనయట్లగాగ ♦ దలచును నెవ్వం
డమల న్యాయపరుండగు
నమరు లతని వందనీయు ♦ డందురు నరేంద్రా.

గీ. పాప మించుక దొడరెడి ♦ పనుల నెట్టి
ఫలము గలిగిన వలదల్ప ♦ పలవిధాయి
యైన పుణ్యమిశ్రిత కార్య ♦ మాచరించు
నది శివంబగు దానని ♦ హమ్ము బరము.

క. మనసును వాక్కును రక్షణ
బనుపడు నెవ్వనికి శ్రుతి త ♦ పస్త్యాగము లా
తని చేతిలోనివగునని
మునిజనములచేత వింటి ♦ ము నిరంతరమున్.

గీ. బ్రహ్మచర్యంబు శంటెను ♦ బరము మత్స్య
మాంసములు రెండు నుడుగుట ♦ మనుజనాథ
లోకయాత్రలు వాటిందు ♦ లోలు పత్వ
శమము గలిగి వర్తించుట ♦ శౌచవిధము.

క. మొదలు జలమిడిన భోజము
మది నడుమను జల్లవనము ♦ దొరకొనుటాడ్కి

న్నోదలను హారికిని మొక్కిన
ముదమొందుదు మెల్లవేల్పు ♦ మూకలు పేర్మిన్.
(భాగవతము.)

క. పరహితము సేయు నెవ్వడు
పరమ హితుండగును భూత ♦ పంచకమునకున్
పరహితమె పరమ ధర్మము
పరహితునకు నెదురులేదు♦పర్వేందుముఖీ. భాగవతము.

గీ. దారరక్షణంబు ♦ దగును దివాస్వప్న
మైథునములు నీర్ష్య ♦ మానవలయు
పరుల మదికి తాప ♦ కరమైన కర్మము
జంతు పీడ జేయు ♦ జనదు పుత్రి. మార్కండేయము.

గీ. సర్వవర్ణములందు నా ♦ శ్రమములందు
నున్న సామాన్య ధర్మంబు ♦ లుగ్గడింతు
సత్యమును శౌచమును సహిం ♦ సయు ననూయ
లేమి క్షమయు నృశంస్యము ♦ ల్వినము మరియు.

క. దీనత్వము లేమియు నిజ
మానస సంతోషమును స ♦ మరజనగుణ సం
తానం బీయష్టకమిల
మానవ మాత్రునకు గలిగి ♦ మనుటొప్పు సుతా.

౬౪. ధర్మముల విమర్శమును గురించి.

క. మైత్రిం బోలెడు ధర్మము
ధాత్రీ దివిజులకు లేదు ♦ దాని నడపినన్
బుత్రా యేకర్మంబు ష
విత్రతయును వలవదది వి ♦ వేకము పేర్మిన్.

సీ. దానంబు సత్యంబు ♦ దపము యజ్ఞము నార్జ
వము కామలోభాది ♦ వర్జనంబు
గురుజన శుశ్రూష ♦ క్రోధరాహిత్యంబు
దమము సంతోష మ ♦ ధ్యయన నిరతి
డాంబికత్వములేమి ♦ దైన్యంబుపొరయమి
యనసూయ యనహంక్రి ♦ యాభియుక్తి
దలపంగ నాద్యమై ♦ తనరు ధర్మము నెప్డు
గాని యాటనాస్తిక ♦ గోష్ఠి జనమి

గీ. శీలసంరక్షతీర్థ సం ♦ సేవ శౌచ
మఖిల భూతములందు ద ♦ యార్ద్రిడగుట
మితహితోక్తులు సంశ్రిత ♦ మిత్రగుప్తి
యున్నియును శిష్టచరితంబు ♦ లిద్ధచరిత.

క. కోపంబు లేమి సత్యా
లాపము నిజదార్ల పరవి ♦ లాసము శుచితో
గోష సముగ్రావాంబవ
నీపాలక సర్వవర్ణ ♦ నియతి గుణంబుల్.

గీ. జంతుపదములెల్ల ♦ దంతిపదంబులో
నడగు క్రియను యహింస ♦ యందు సకల
ధర్మములు నడంగు ♦ కర్మ సంత్యాగికి
నైన భూతదయయ ప ♦ రమగుణము.

క. కొందరు కర్మ కరణ మతి
నందింతురు పారలౌకి జ ♦ నన మార్గణంబుల్
పొందక పోరాడు మహా
నందము బొందుదురు నిత్య ♦.

గీ. తిరిసియేనియు నన్నంబు ♦ దెచ్చి యతిథు
లైన విప్రుల యాకలి ♦ యణపహరించు

బురుషు డూర్ధ్వలోకమ్మున ♦ బురుషవరుల
కర్చనీయుడై వెలుగుచు♦నందయుండు. అనుశాసనీకము.

గీ. దినము సంధ్యంబుగాకుండ ♦ దివిరి యన్న
పానదానంబు లొదవిన ♦ భంగిజేసి
మరిభుజించుట బోలెడు ♦ మహిత ధర్మ
కార్య మొండొకటెందును ♦ గలదె యరయ.

గీ. నిరయమునకు ప్రాప్త ♦ నిగ్రహంబునకును
పదవిహీనతకు ని ♦ బంధమునకు
నర్థభంగమునకు ♦ నఖిల దుఃఖములకు
పొరవ దేవ! బొంక♦పెరచినట్లు. (భాగవతము.)

క. మనసున వాక్కున గాయం
బున నెవ్వడు సర్వభూత ♦ ములయందు శుభం
బొనగూడ దలచు నాతడె
వినుడీ జ్ఞానమ్ము నొందు ♦ విగత భయుండై.
(బ్రహ్మాండపురాణము ఉపోద్ఘాతపాదము.)

క. పరులకు భీతిల జేయక
పరులవలన భీతినొంది ♦ పారక కామో
ద్ధురుతం బొందక ద్వేష
స్ఫురణము నొందని యతండు ♦ పొందును ముక్తిన్.
(బ్రహ్మాండపురాణము.)

ఉ. కామము భోగయోగమున ♦ గాంచదు తృప్తి నికేమియున్నను
ద్దామ గతింజెలంగు నిది ♦ తథ్యము వహ్నిహవిః ప్రధానతన్
దామహిశాంతి నొందున ని♦తాంతము వృద్ధినిబొందుగాక యిం
కేమి యొనర్చినన్ జెడము♦హీనముగన్ గడుయోర్చియుండినన్.
(బ్రహ్మాండపురాణము.)

మ. తను నిందించిన గొట్టియున్ క్షమయె స్వ♦ద్రవ్యంబుగాగల్గు న
మ్మునులాకారహితుల్ సుశాంత మనసుల్ ♦ మోదంబునేకాంతు ర

య్యనఘుల్ ప్రత్యపకారముం దలపక ♦ త్యంతక్షమావంతులై
పునరావృత్తి విహీనమౌ పదమునే ♦ పొందంగనుందుర్ గదుర్

తే. ఎవడు దుష్టులచే నతి ♦ హీన వాక్య
ములను దండాది తాడనం ♦ బులును బొంది
యును మదిర్ క్షోభ మొందక ♦ యుండు నతడె
సాధువనబడు వానికే ♦ సౌఖ్యమబ్బు.

క. దండించిన వానిని ప్రతి
దండనమును బొందజేయు ♦ దౌర్భాగ్యుడు భూ
మండలమున దగు పాపా
త్ముండని జెప్పంగ దాన ♦ దోసగులు పొసగుర్.

తే. శ్రాద్ధములచేత పితరులా ♦ రాధితులయి
సోము సంతోషపరతురు ♦ సోముడలరి
యెల్లలోకంబులను బ్రీతి ♦ యొసగ వృద్ధి
బొందజేసెడు వాడు స ♦ త్పురుషచంద్ర.

చ. పితరులకెల్ల సోముదును ♦ వీరుడు మేటియునై చెలంగు న
ప్రతిమ గుణాఢ్యు నాతనిని ♦ శ్రాద్ధవిధిం బరితృప్తిజేయ నీ
క్షితిగల సర్వభూతముల ♦ జేతనయుక్తిని బొందజేయుచుర్
సతతము వృద్ధిజేయు దరు ♦ జాతము దీగెల నాతడెంతయుర్.

(బ్రహ్మాండపురాణము.)

గాన, చెట్టునందలి యొక పలుదోము పుల్ల విరచిన సోము
పెంచిన బిడ్డను గిల్లినట్లర్థము.

తే. తపములెన్నొ విధంబుల ♦ దనరు వాని
యందు చూడంగ యోగంబె ♦ యలరు మేటి
యగుచు గావున బరమేష్ఠి ♦ ధ్యానయోగ
సక్తినరారి సృజియించె ♦ జగములనెల్ల.

గీ. బ్రహ్మచర్య మహింస నా ♦ బరగు పరమ
ధర్మములు రెండు సర్వో యు ♦ త్తమ తపంబు

దాని గలవాడు నిర్మల ♦ జ్ఞానయోగ
వంతుడై చూడనేర్చు స ♦ర్వంబు ననఘ. (శాంతి.)

క. ఒరులేయవి యొనరించిన
నరవరయ ప్రియము దన మ ♦ నంబునకగు దా
నొరులకు నవి చేయకునికి
పరాయణము పరమ ధర్మ ♦ పథములకెల్లన్.

క. క్షమయును సత్యంబును శౌ
చమును సుధర్మములు బ్రహ్మ ♦ చర్యం బత్యు
త్తమ ధర్మము వానికి జి
త్తమునలవఋపంగవలయు ♦ ధైర్యము పేర్మిన్.

గీ. అన్నమైన దోయ ♦ మైన ద్రవ్యమయిన
శాకమయిన దనకు ♦ జరుగు కొలది
యతిథి జనుల కడ్డ ♦ మాడక యిడలేని
లేమ వారు పుడమి ♦ లేనివారు. (భాగవతము.)

## 59. వృక్ష విషయ ధర్మము.

క. ఇల బక్షుల కాశ్రయమై
ఫలియించెడి తరువునరుకు ♦ పాపాత్ములు సం
కెలలబడి ఘోరనరకా
గ్నుల గూలరె యముని భటులు ♦ కొరవులజూడన్.
(పద్మపురాణము.)

వ. గాన, యజ్ఞమ్మందు మాత్రము పశువును బట్టవలయును సంతర్పణలయందు వంటచెరుకు నిమిత్తము మాత్రమే చెట్టుకొట్టవలయును స్వకార్యములకు పుల్లకూడ విరువకూడదు.

## 60. ఏకాంతిక ధర్మ ప్రకారంబు.

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనునితో నేకాంతికజనంబులు లోకోత్తరులనిచెప్పి తద్యోకాంతికత్వం బెట్టిది. ఎరింగింపవే యనుటయు నతండతని కిట్లనియె.

గీ. సాంఖ్యయోగ పరమ ♦ సార భూతంబిది
మున్నువింటె యుద్ధ ♦ మునకు జోరక
కరుణ నార్జునైన ♦ గాండీవి బోధింప
కృష్ణు జెప్పెనట్టి ♦ గీతలందు.

క. నిర్మలమగు నైకాంతిక
ధర్మము నారాయణోది ♦ తంబై క్రియలం
గర్మఠుడగు బ్రహ్మమతని
ధార్మికవర యొలసె నతడు ♦ దయు జగురోత్తక.

క. దక్షునకు నెరింగించిన
దక్షుడు బోధించె దనదు ♦ దౌహిత్రు జగ
చ్చక్షుని కాసవిత్రుండు మ
ను క్షితిపతికిచ్చె నవ్వ ♦ నుత ధర్మంబుక.

క. మనువిక్ష్వాకున కొసగె న
తనివలన దదీయ యోగ్య ♦ తాకలితులు స
జ్జనములు వడసి రనేకులు
విను నారాయణునిచేత ♦ విని నారదుడుక.

క. తగియొదు శిష్యుల కొసగెను
జగతీశ్వర యిట్లరి ప్ర ♦ శస్తంబై యి
జ్జగములను గలిగె వినుమ
త్యాగాధ ధర్మంబు దుష్క్ర ♦ తా పాప్యంబుక.

క. దానికహింసయె మూలము
దావన హరిబోధితుడగు న ♦ తండన ధరణి

జానీ క్షేత్రజ్ఞుం డన
గా నొక్కడ యగుట దెలియ గావలయు దగన్.

క. ఏకద్విత్రి చతుర్వ్యూ
హాకారత దోచుచుండు ♦ హరిభక్తజనా
లోకనను వాసుదేవో
ద్యోగప్రాప్తముగ దత్త ♦ దుచితస్ఫూర్తిన్.

గీ. వాసుదేవుండు ప్రథమము ♦ వసుమతీశ
మౌళిసంకర్షణుండు ప్ర ♦ ద్యుమ్నుడని ద్వి
తీయకంబు దృతీయంబు ♦ తెల్లమచ్చ
తుర్థమని రుద్ధుడిట్లు చ ♦ తుర్విధములు.

క. యీ నెలవులదోచును హరి
తా నెక్కడ యింద్రియ ప్ర ♦ తతికందండే
కానూనభక్తి కగుపడు
దానికి దపమును శమంబు ♦ దమమగువలయున్.

క. శాంతి పరినిష్ఠునకు నే
కాంతిక ధర్మంబు కరత ♦ లామలకమగున్
జింతాతంతు త్రుటనా
త్యంత విదగ్ధంబు సూవె ♦ యని మనుజేంద్రా.

---

## 61. సకల జనులకు సనాతన ధర్మము.

---

వ. నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మనిర్ణయంబుప దేసించుటలో ధర్మరూప మఖిలంబు నెరింగింపు. వినగ నిచ్చగలదు విమలచరిత యనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణి యందు నిజాంశంబున జన్మించి భువనశోభనంబు కొరకు బదరికాశ్రమంబున తపోనిరతుండై యున్న నారాయణమునివలన సనాతన ధర్మం

బువింటి నది సెప్పెద సకలవర్ణంబుల జనులకు సత్యంబును దయయు నుపవాసాది తపంబును శౌచంబులును స్థైర్యంబును సదసద్వివేకంబును మనోనియమంబును బహిరింద్రియజయంబును హింసలేమియు బ్రహ్మచర్యంబును దానంబును యథోచిత జపంబును సంతోషంబును మార్దవంబును సమదర్శనంబును మహాజనసేవయు గ్రామ్యంబులైన కోరికలు మానుటయు నిష్ఫలక్రియలు విడుచుటయు మితభాషిత్వంబును దేహంబుగాని తన్ను వెదకికొనుటయు నన్నోదకంబులు ప్రాణులకుంబంచి యిచ్చుటయు ప్రాణులయందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధింజేయుటయు శ్రీనారాయణ స్మరణ కీర్తన శ్రవణసేవార్చన నమస్కారదాస్యాత్మ సమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలిగి విధిచోదిత ప్రకారము చతురాశ్రమములు జరిపి ముక్తి నొందుట.

## 62. భాగవత ధర్మము.

క. వర్ణాశ్రమ ధర్మంబులు
నిర్ణయ కర్మముల జెడక ♦ నిఖిల జగత్సం
పూర్ణుడు హరియను నాతడ
వర్ణింపగ భాగవతుడు ♦ వసుధాధీశా.

## 63. పరస్త్రీలయందు పరద్రవ్యములయందు సకలభూతములయందు పురుషుల కుండవలసిన భావనావిషయము.

సీ. తనయందు నిఖిల భూ ♦ తములందు నొకభంగి
సమహితత్వంబును ♦ జరుపువాడు
పెద్దల బొడగన్న ♦ భృత్యుని కైవడి
లేచి నమస్కృతుల్ ♦ సేయువాడు

కన్నుదోయికి నన్య ♦ కాంతలడ్డంబైన
మాతృభావము జేసి ♦ మరలువాడు
తల్లిదండ్రుల భంగి ♦ ధర్మవత్సలతను
దీనులగావ జిం ♦ తించువాడు

గీ. సఖులయెడ సోదర స్థితి ♦ జరుపువాడు
దైవతములంచు గురువుల ♦ దలచువాడు
లీలలందును బొంకులు ♦ లేనివాడు
లలిత మర్యాదుడైన ప్ర ♦ హ్లాదు డధిప.

శ్లో॥ మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణిలోష్ఠవత్ ।
ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిసపశ్యతి॥

## 64. ధర్మార్థకామముల తారతమ్యము.

వ. వినోదగోష్ఠినుండి విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమ మధ్యమాధమత్వనిరూపణంబు సేయుడు చూతమని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె.

క. విను ధర్మంబున ధనమగు
ధనమున సిద్ధించు గామ ♦ తంత్రంబటు గా
వున మధ్యమంబు నధమము
ధనకామము లుత్తమంబు ♦ ధర్మంబధిపా.

## 65. పాతివ్రత్య ధర్మము.

క. నవతాలికి బతివలచిన
నవ్వుగాకని యుతవి యిచ్చు ♦ తనురూపముగా
[illegible] నడచు సతి దైవము
శివయది తగునెల్ల జనము ♦ చే మ్రొక్కగొనన్.

గీ. ఎఱుక గలిగి పిదప ♦ నేనియు పతి భక్తి
గలిగి ధర్మమోపి ♦ సలిపి శాంతి
గలిగియున్న మున్ను ♦ గల పాపములువాసి
పురుషుతోడ దివికి ♦ బోవగండ్రు.

క. ఉపవాసంబులు వ్రతములు
దపములు వెయ్యేల భర్త ♦ దైవతమని ని
ష్కపటత గొల్చిన సాధ్వికి
నృపవర దుర్లభము లేదు♦నిఖిలజగములన్. భాగవతము.

సీ. నిలయము వాటించి ♦ నిర్మల దేహియై
శృంగార మెసగిద్దు ♦ జేయువలయు
సత్యక్రియాలాప ♦ చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రం ♦ జింపవలయు
దాక్షిణ్య సంతోష ♦ ధర్మ మేధాదుల
దైవతమని ప్రియు ♦ దలపవలయు
నాధుడేపద్ధతి ♦ నడచు నాపద్ధతి
గడచి సద్బంధుల ♦ నడుపవలయు

గీ. మార్దవమున బతికి ♦ మజ్జనభోజన
శయనపాన రతుల ♦ జరుపవలయు
విభుడు పతితుడైన ♦ వెలది పాతివ్రత్య
మహిమ బుణ్యు జేసి ♦ మనుపవలయు. భాగవతము.

క. తరుణి తన ప్రాణవల్లభు
హరి భావమ్మున భజించి ♦ యతడును దానున్
సిరికై వడి వర్తించును
హరి లోకము నొందు సంత ♦ తానందంబున్.

శ్లో॥ కార్యేషుదాసీ కరణేషుమంత్రీ రూపేచ లక్ష్మీక్షమయాధరిత్రీ।
భోజ్యేషుమాతా శయనేషురంభాషట్కర్మయుక్తాకులధర్మపత్నీ॥

## 66. పతివ్రతామాహాత్మ్యము—మార్కండేయ పురాణము.



సీ. కౌశికుండను పేర ♦ గలడు మున్నొక్క వి
　　ప్రుండు ప్రతిష్ఠాన ♦ పురమునందు
నాతండు జన్మాంత ♦ రాఘంబువలన కు
　　ష్ఠవ్యాధి పీడిత ♦ సకలగాత్రు
డాతని భార్య మ ♦ హా పతివ్రత పతిఁ
　　దేవునివలె భక్తి ♦ సేవ జేయు
పాదసంవాహన ♦ ప్రక్షాళన స్నాన
　　భోజనాచ్ఛాదన ♦ పూర్వకముల

గీ. శ్లేష్మమూత్రమలవ్రణా ♦ సృక్ప్రవాహ
మార్జనక్షాళనాదుల ♦ మంజువచన
రచనల రహస్య సంప్రీతి ♦ రంజనోప
చారములచేత నర్చించు ♦ సంతతమును.

క. ఇటులర్చించుచు నుండిన
జటుల క్రోధుం డతండు ♦ సతినివిసీరఁ
కటుతరవాక్యంబులచే
బటపటయన పండ్లుగొరికి ♦ భర్జన సేయుః.

క. ఏమన్నను కోపింపక
తామన్ననతోడ తనదు ♦ దైవతమనియుఁ
దామెయి సతిభీభర్తృని.
సీమంతిని దలచు సతని ♦ శ్రేష్ఠునిగాఁగ.

సీ. ఇటులున్న నొక్కనా ♦ డింతితో కౌశికుం
　　డిట్లను సాధ్వినే ♦ నించుకైన
సంచరించగలేను ♦ చారువయోరూప
　　లావణ్యముల నొప్పు ♦ లలితగాత్రి

యొక వేశ్య నేనింట ♦ నుండగ నీవీధి
జనుచు దటాలున ♦ కనులబడితె
నది మొదల్ గాగ నా ♦ మదవతి నామది
బొదలుచున్నది దాని ♦ వదల వశమె

గీ. చారుపీనపయోధర ♦ చటులనయన
నిమ్ననాభి పృథుశ్రోణి ♦ నీలవేణి
ఇట్టి సర్వాంగ సుందరి ♦ నేనయకున్న
మృతుని ననుగాంతు వఖలజ్ఞ ♦ వతివ వినుము.

క. కాముడు త్రైలోక్యమునకు
వాముండటుగాన దాని ♦ వయసుంగనినన్
వేమంది వెంట దిరుగదు
రామానినిగూర్పుమి పుడ ♦ యతిరయమొప్పన్.

క. ప్రాతఃకాలముననే
నాతరుణిగంటి నిప్పు ♦ డయ్యెను నిశనీ
వా తెరవ గృహంబున కిపు
డేతగగొని పొమ్ము లెమ్ము ♦ డెందంబలరన్.

క. దానిని బొందక యున్నను
మానిని బ్రతుకంగ వశమె ♦ మరియెవ్వరికిన్
దానికడను జనసంకుల
మైనదిగా దోచుమురి ♦ డే నౌన క నలే.

మ. అలకామాతురుడైన భర్త వచనం ♦ బాలించి య్యాసాధ్వి స
త్కుల సంజాత మహాపతివ్రత కటా ♦ కోరిక బిగనగట్టి సా
మ్ములు శుల్కార్థ మోరెల్లగట్టి ప్రియునిన్ ♦ మోపై కగా జేసి వి
న్నలమర మేను మెత్తమీటక దెట్ ♦ దివ్యాకారగరథ్యాజనన్.

గీ. అంధకారంబు బ్రమ్మక ♦ మగుడ్డుమంద
రాజమార్గంబులోన నా ♦ రజనియందు

బతిప్రియము సేయు బుద్ధి న ♦ య్యతివ మిగుల
మందగతి బోవుచుండె న ♦ మ్మార్గమందు.

క. చోరాపదేశమున నతి
దారుణమగు శూలమందు ♦ దగిలించిరి దు
ర్వారభటులు నిత్యాతప
స్సారుఁ మాండవ్యమౌని ♦ సత్తమునివురిఁ.

శా. నారీస్కంధమునఁ వసించి జనుచుం ♦ డఁ వీవుప్రాదంబు శూ
లారూఢుండగు మౌనికిఁ వ్యథకరం ♦ బై దారువుందాక నా
ఘోరంబై దగు వేదనఁ గొనుట స ♦ క్రోధాత్ముడై మౌని దు
ర్వారోగ్రంబగు శాపమిచ్చెనట ద్యా ♦ వాభూములల్లాడగఁ.

వ. అది యెట్లనిన.

గీ. ఘోరతరకార్యమందు ♦ ఘోరంబుగా గుచ్చఁ
బడి మహోగ్రమంటు ♦ పొలుబడుచు
నున్న నన్ను గదిపి ♦ యుడికించె నెవ్వాఁడు
వాడు జచ్చు నినుడు ♦ వచ్చునపుడు.

క. రవికాంతి జూచినప్పుడ తఁ
డవశుండై చచ్చుఁగాక ♦ యని శపించియుచూ
ధవునకగు శాపమును విని
యువిద బలికె సూర్యుడుదయ ♦ మొందడటంచుఁ.

గీ. ఆ పతివ్రత ప్రోక్తోక్తి ♦ యయెటుగాక
యుండబలికిన నుడియించె ♦ తుర్డ తపను
డంత బహురాత్రి లోకములై ♦ యంధకార
మగ్నమై యుండె జగములు ♦ మాయదోడగె.

ఉ. దేవతలెల్ల భీతిలి మ ♦ ర్ది దలపోసిరి
లేవు వషట్కృతుల్ మడిసె ♦ లీనములయ్యెను దైవపైతృ కా

ర్యావళి యీజగంబికల ♦ యంబును బొందక యుండుటెట్టులో
కావున రాత్రియుంబవలు ♦ గల్గక యుండిన నిల్వవచ్చునే.

గీ. వసుధలో దివారాత్రి వ్య ♦ వస్థలేక
నగునె మాసర్తు విజ్ఞాన ♦ మదియు లేక
దక్షిణో త్తరాయణములు ♦ దనరుటెట్టు
లవి దనరకున్న వత్సర ♦ మగుట గలదె.

సీ. వత్సరజ్ఞానంబు ♦ వర్తిలకుండిన
నితర కాలజ్ఞాన ♦ మెట్లు గలుగు
నలపతివ్రత బల్కు ♦ బలమున భాస్కరు
డుదయింపకుండె ని ♦ట్లు ♦ న్న స్నాన
దానాది సత్కృతుల్ ♦ దప్పిపోవును మరి
యగ్నిహోత్రాదులు ♦ నణగు నందు
వలనను మనకింక ♦ గలుగ దాప్యాయనం
బాప్యాయితులమైన నంబువృష్టి

గీ. గలుగ జేతుము దానచే ♦ గద ఫలించు
నోషధులు సస్యముల ఫల ♦ మొంది నరులు
హవ్యముల మనకిచ్చెద ♦ రధ్వరముల
నచిరతులమయి గాంతు ♦ మభిమతములు.

సీ. వసుధ నరుల్ హవి ♦ ర్వర్షంబుచే నూర్ధ్వ
వర్షులౌదురు జల ♦ వర్షమునను
మనమధోవర్షుల ♦ మనబడుదుము నిత్య
నైమిత్తికములనే ♦ నరులు మనకు
సంతుష్టి జేసెదు ♦ జన్నంబులను మాని
వారె భుజింతురు ♦ వారిదుష్ట
బుద్ధుల నాశంబు ♦ బొందింప క్షితిజులా
ఘలికాయువుల వలె ♦ కలుషములుగ

గీ. జేసి దోషంబులను గల్గ ♦ జేతుమంత
మనుజులా దుష్టతోయాదు ♦ లనుభవింతు
రందునను మృత్యుహేతువు ♦ లగు నుపద్ర
వంబులను బొందెదరు స్వాపా ♦ పంబువలన.

క. మనలక్ హావ్యంబులచే
దనిపి యెవరు శేషముననె ♦ దనిసెదరో త
న్మనుజులకు సదన్వయమును
ఘనతర లోకముల నొసగి ♦ కాతుము కరుణన్.

క. ఇది యెల్లవృష్టి సంస్థితి
నొదవక యుండినను వీర ♦ లొనరింతురె యె
ట్లుదయించును భాస్కరుడని
త్రిదశులు దారిట్లు బల్కి ♦ రి మనోవ్యథతోన్.

క. జన్నము లుత్పన్నములై
నన్నరులును మనము కీడు ♦ నన్ బొరసెద మం
చున్న యెడగాంచి సురలకు
నన్నలువ వచించె నిట్టు ♦ లన్నిధయ దొలుకన్.

క. వినుడీ తేజము తేజం
బున తపమున తపము శాంతి ♦ బొందు నటుల గా
వున ననిమిషులార వికీ
ర్తన్నాన్నుదయ మిది పతివ్ర ♦ తా మహిమముచేన్.

క. మనుజులకును మీకును న
య్యనుడుదయము నొందకున్న ♦ నిడుమగు నటు గా
వున నత్రిభార్య ననసూ
యనుగనుడాయమ పతివ్ర ♦ తా గ్రణిగానన్.

క. ఆయమ బ్రసన్నగాగన్ జే
యుడు మీకార్యమట్లుడ ♦ చేయుననిన వ

ల్లేయని సురలత్రి ముని
పేరియసిగని వేడుకొనిరి ♦ బీతి దలిర్పఁగ.

చ. అమరులు వేడుకొన్న నపు ♦ డత్రిమహాముని భార్య సుప్రసా
దమహితయై భవద్ధితము ♦ తప్పక జేసెద జెప్పుమన్న పూ
ర్వమువలె రాత్రియుంబవలు ♦ వచ్చుచు బోవుచు నుండునట్లు జే
యుమనుడు సాధ్వియిట్లనియె ♦ నోసురలార వినుండు జెప్పెదన్.

మ. సతిమాహాత్మ్యమనల్ప మెట్టులగునో ♦ సాధ్వీప్రదంబరా
నతిసమ్మానిత జేసి సేవవలురా ♦ నర్థించి గావింతునే
స్థితిమున్నుండె నహర్నిశాగతులు త ♦ ద్రీతిన్ దగన్ జేతు త
త్పతిపంచత్వము బాపి జీవితునిగా ♦ బాటింతునంచున్ వడిన్.

చ. అని యిటుబల్కి సాధ్వి సుర ♦ లందరు నాసతి భవ్యమందిరం
బునకు జటాలునన్ జని వి ♦ భున్ పరిచర్యల దన్పుచున్న సా
ధ్విని గని క్షేమమారసి స ♦ తీ నిజధర్మము భర్తృధర్మమున్
దనరును గాదె విఘ్నములు ♦ దాకక యుండును గాదె సుందరీ

వ. అని మరియు నయ్యనసూయాదేవి కౌశికపత్ని కిట్లనియె

క. పతిమోహముగాంచి నప్పుడు
మతిముదమును గాంతుగాదె ♦ మాన్యతచే దే
వతలందరి కంటెను నీ
పతి నెక్కుడుగాగ దలతె ♦ భవ్యచరిత్రా.

సీ. భర్తృశుశ్రూషా ♦ పరతచే నాకు ను
హాఫలంబిట్టుల వం ♦ ఛాశ్రమయ్యె
నంగవ నర్యశా ♦ న్యు ఫలంబు సిద్ధించు
సుపథమా భర్తృ శు ♦ శ్రూషవలన
పంచణాములు దీర్చి ♦ బడవేలె నతునిచే
నాత్మవర్ణోచిత ♦ మయిన ధర్మ

మునను గూర్పగవలె ♦ ధనసంచయంబు నా
ధనమును సత్పాత్ర ♦ మునను వ్యయము

గీ. సలుపవలయు శక్తి ♦ కొలదిగ సత్తపో
దానధర్మశౌచ ♦ దయలు నార్జ
వంబు గలిగినియతి ♦ వర్తింపవలె నింక
వినుము చెప్పెదను వివేకమలర.

సీ. శాస్త్రనిర్దిష్ట ప్రశస్త కర్మములను
రాగవిద్వేష వ ♦ ర్జనముగాగ
దన శక్తికొలది శ్రద్ధాపురస్కృతిగాగ
ప్రతిదిన మాచరిం ♦ పంగవలయు
వినునరుల్ నిజజాతి విహితలోకముల బ్రా
జాపత్యముఖముల ♦ జాలక్లేశ
ములబొందు దురుక్రమం ♦ బున నిటు బురుషుల
చేత గష్టమున నా ♦ ర్జింపబడిన

గీ. సకల పుణ్యంబులందును ♦ సగము వనిత
లొందుదురు పతిశుశ్రూష ♦ యొప్ప జేసి
శ్రాద్ధముపవాసములు వేర ♦ జన్మములును
లేక వసియింతురీప్సిత ♦ లోకములను.

క. సతి యాతుల గాన వీనా
బతిశుశ్రూషణముఖ్యంబు ♦ భరతగలిగి స
మ్మతివర్తింతురుగాకే
పతిసేవ పరమగతి గాన ♦ భామల కెల్లన్.

క. సురలకు బితౄలకున్
పురుషుం డాచరించు నట్టి ♦ పూజాదులలో
వరశుశ్రూషయె సతి కి
త్పరత ననన్యాత్మమైన ♦ సాధనము గనుమా.

సీ. అనసూయ పల్కుల ♦ త్యాదరంబున విని
సంభావనము జేసి ♦ సాధ్వి తనిసి
యత్రిపత్నికి నిట్టు ♦ లనియె నో ప్రకృతి క
ల్యాణి నీవిప్పు డి ♦ ట్లని వచించి
నాశ్రద్ధ వృద్ధి నొందగ జేసితివి గాన
జన్మంబు నాకిపుడు ♦ సఫలమయ్యె
ధన్యనైతిని దేవ ♦ తలప్రీతికాస్పద
నైతిని నారుల ♦ కరసి జూడ
ఆ. వె. బతి సమానమైన ♦ గతి లేదు తత్ప్రీతి
యుభయలోక గతికి ♦ నుపచరించు
బతి ప్రసాదముననె ♦ బడయు కీర్తి సుఖంబు
నితడె దైవమింత ♦ యెరుక గలదు.
గీ. ఆర్య యేమిపనికి ♦ నై యిందు వచ్చితో
పలుకు మిక్క మహాను ♦ భావురాల
భర్తవలన నొందో ♦ పణతి నావలననో
జేయువలయు దాని ♦ జెప్పుమనిన.
వ. అనసూయ కౌశికపత్ని కిట్లనియె.
సీ. వీరె యిందాది ల్పుర ♦ ద్వారకులె నను గాంచి
వగచిరి భవదీయ ♦ వాగవాప్త
సత్కర్మ దినరాత్రి ♦ సన్నిహాపనులై
పూర్వరీతి సఖండమగనహర్ని
శాదిదశాప్తిని ♦ యాచించి రమతె
దేధశిమై యిచటికి ♦ సరుగుదెంచి
నినుగాంచితిని విను ♦ నీరజలోచన
పవలులేకున్నను ♦ బహుళయాగ
ఆ, వె. కర్మములు నశించె ♦ కర్మవిచ్ఛిత్తిచే
దేవతలను పుష్టి ♦ భావమయ్యె

దినము లేనినాడె ♦ దెగు నన్నికర్మము
లందుచే నవగ్రహంబు లొదవు.

క. దానఁ జగము నశించుఁ
గానఁ సత్యమున నీ జ ♦ గంబును విపదం
భోనిధి సముద్ధరింపగ
బూని యుదయ మొంద జేయుము రవిఁ గరణన్.

వ. అనిన నా బ్రాహ్మణి యిట్లనియె.

గీ. విను మహాభాగ మాండవ్య ♦ముని శపించె
సవిత యుదయింప నాభర్త ♦ నమయునట్టు
లేమి సేయుదు ననిన న ♦ య్యంతి బలికె
సాధ్వి వినుము మేను బల్కెద ♦ సత్యముగను.

క. ఆముని వచనముచే నీ
భూమీసురు డేమితైన ♦ పూర్వమువలె నీ
స్వామి శరీరము కోమల
మై మెరయు నజేతు నమ్ము ♦ మగున వినుమా.

క. పతిదేవతల మహాత్వము
పతితంబభివంద్య మగుట ♦ నన్నామింతుఁ
మతిదలపు మనిన కౌశికు
పతిగా నిమ్ముటులె యనుచు ♦ సమ్మతి బడియెన్.

క. అనసూయ సద ♦ ంజలి
గొని పదిదిశ లొక్కటైన ♦ ఘోరపదము నిశ
న్వినిచితమై సూర్యుని ర
మ్మని పిలిచెను దక్షణంబ ♦ మార్తాండుండున్.

గీ. ఫుల్లపద్మారుణాభాణ ♦ పూర్ణమండ
లంబు దనరగను దయించ ♦ లంబు నొక్క

సంతతోన్నత శ్రీనిధి • దనఁగఁ దాను
దగుచు బడియెను భూమ్యుత్థ • మందు నంత.

ఉ. అతని పత్ని తాని తను • వల్లభు నట్టి ధరించి యత్తరి
న్నాతర దివ్యపాదములు • గొల్చి మనమును నాలంబునుం
బాయపుగా౯ ధ్రువుణ • జూడు మటంచును పత్రి భాగ్య వి
ఖ్యాత చరిత్ర సాధ్వి మహి • మాతిశయం బలరంగ నిట్లనె౯.

సీ. భర్తృశుశ్రూషచే • బాతివ్రత్య తపము నా
కించుకంతైన వ • ర్తించెనేని
భర్తతో సరిగాగ • పరపూరుషుని యెట్టి
చోటనైనను మది • జూడనేని
మహనీయ రూపవా • జ్ఞాధుర్యములచేత
నొరునితో బతిభేద • మరయనేని
భర్తతో సమమైన • పరదైవతము నొండు
వారినిద్రానైన భా • వించనేని

తే,గీ. యట్టి నా సత్యమున నిప్పు • డిట్టి విప్రు
డఖిల రోగములను బాసి • యౌవనంబు
దనర జీవితమును బొంది • దారయుక్తు
డగుచు నుండెడుగాక నూ • ఱబ్దములను.

క. మనమున వాక్కున కర్మం
బున పతిశుశ్రూషయం దె • పుడు నుద్యుక్తి౯
దవరితినేని విరామము
దునుఁదువకైమ ద్విజుడు బ్రతికె • దు నెమలరంగ౯.

క. అని యిటు లనసూయ పలికిం
చిన విప్రుడు లేచె మరల • జీవితుడై య
వ్వనము నిరోగతయును దగ
తనుకాంతుల పొల్పొదవుగ • దగ దేవునకా.

గీ. పుష్పవృష్టి గురిసె ♦ భోరున దేవదుం
దుభులు మ్రోసె ముదము ♦ దొంగలింప
నఖిల సురలు నిట్లు ♦ లధిరతసహాయుతో
పతము లిత్తు మేదిఁ ♦ పలతో వెప్పుమనా.

గీ. వినుము కల్యాణి జేసితి ♦ విబుధకార్య
మధిక దుష్కర్మ మటుగాన ♦ నమరులెల్ల
వరదులైరి నీ మదినున్న ♦ వాంఛితంబు
దీర నడుగు మనంగ సా ♦ ధ్వియు వచించె.

క. కమలభవుడు మొదలగు నీ
యమరులు నాపై బ్రోసన్న ♦ లైరేని సురో
త్తములార వరము గొన వ
హ్నాముైన దానదయి నట్టు ♦ లరసితిరేని.

గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ ♦ పరమ కృపను
బుత్రులై నాదు గ్రమమున ♦ బుట్టవలయు
పతియుతంబుగ యోగంబు ♦ బడసి క్లేశ
ముక్తి గనగా వలయునని ♦ ముదిత బలుక.

క. సురలెల్ల తేనమస్త్వని
పరమామోదమున వత్తె ♦ పస్విని నధికా
దరమున దొనియాడుచు నా
హారిహార కమలాసనాదు ♦ లరిగిరి దివికిన్.

67. తల్లిదండ్రులయెడ నడువవలసిన విధి విమర్శనము.

సీ. అరయ నాచార్యుండు ♦ పరతత్త్వరూపంబు
దంఁడ్రి దలంపగ ♦ ధాతరూపు
రూపింప భ్రాతయు ♦ దుర్పతి రూపంబు
తెలియంగ తల్లి భూ ♦ దేవిరూపు

భగిని దయారూపు ♦ భావంబు ధర్మస్వ
రూపంబు దానర్థి ♦ రూపు మొదల
నభ్యాగతుడు మున్న ♦ యగ్నిదేవుని రూపు
సర్వభూతములు కే ♦ శవునిరూపు

తే,గీ. గాన తండ్రి వేగ ♦ గడు నార్తులకు పితృ
జనులమైన మమ్ము ♦ జల్లజూచి
పరభయంబు వాపి ♦ నిరుపమంబగు తపో
మహిమచేత మెరసి ♦ మనుపుమయ్య.

సీ. జననుత వీరు నా ♦ జననియు జనకుండు
జువ్వో వీరలకు శు ♦ శ్రూష జేసి
ఇట్టి పరిజ్ఞాన ♦ మేను బ్రాపించితి
నమరుల బూజింతు ♦ రర్థినెల్ల
వారును నొండు దై ♦ వంబును నొల్లకీ
వృద్ధులు నాపాలి ♦ వేల్పులనుచు
గమనీయఫల పుష్ప ♦ గంధ భూషణ వస్త్ర
ములు మనోహర భక్ష్య ♦ భోజ్యములను

తే,గీ. వీరి కెపుడు నివేదింతు ♦ వేడ్క బుత్ర
దార సహితుండనై నియ ♦ తముగ శేవ
యాచరింతును వేదముల్ ♦ యజ్ఞములును
వ్రతములును వీర నాకను ♦ వ్రతము దృఢము.
ధర్మవ్యాధుడు కౌశికునకు చెప్పుట. (భారతము.)

గీ. గురువు లందరిలో నైదు ♦ గురు విశేష
పూజ్యులందును ముగురొగి ♦ పూజ్యతములు
వారిలో మాతృపూజ స ♦ ర్వంబుకంటె
నంతకంటెను దైవత ♦ మన్యమేది. (కూర్మపురాణము)

గీ. తల్లితో తుల్యమైనట్టి ♦ దైవమేది
తండ్రికంటెను గురుడిక ♦ ధాత్రిగలడె
వారలను దగు నట్లుప ♦ కారమెన్న
నొకటి గలుగన వారిమె ♦ మున్నదింక.

క. మాతాపితృ [illegible]
లై తనరు మహానుభావు ♦ లశ్రమమున గో
పైతృమహాసురగంధ
ర్వాతతలోకములు గన న ♦ ర్హులు చెలియా.

మ. ముదమొప్పన తండ్రి యాజ్ఞ దల ♦ మోచి నిజోచిత కృత్యమెమి పం
చిన దన శక్తిచేత నెడ ♦ సేయక చేయుట పుండరీకలో
చన పదసేవ చేయుట ప్ర ♦ జాపరిపాలనశాలి యాలయుగ్
జనసుతుండై సుతుండు పర ♦ చర్యలొనర్పుట యవ్వి పుత్రకా.

చ. అన విని రాముడిట్లనియె ♦ నార్యజనోత్తమ పుత్రలబ్ధికై
జనిగొని తల్లిదండ్రి పను ♦ పాటులకుం బ్రతిసేయనౌనె యిం
పున దలచాచి నీళ్లు కడు ♦ పుంగని యన్నము పోశిపెట్టి మొం
దను బడిగాలి దాల్చుచు ది ♦ నంబును వారలతుల్యులే యొరుల్.

(ఆంధ్రవాల్మీకి రామాయణము.)

క. తనుదాను గాచుకొన జా
లని దశలను [illegible] లించు [illegible]
ర్థన మొనరింతురు సత్పుత్రు
మును బుక్కుదురయ్యా వారు ♦ ముచ్చట మీరన్.

ఆంధ్రవాల్మీకి రామాయణము. శ్రీరాములు వసిష్ఠునితో చెప్పుట.

వ. మనుష్యులకు తల్లిదండ్రి ఆచార్యుడు వీరలే ముఖ్యములగు దైవములగుదురు. శరీరమును కలుగ జేయుటచేతను సన్మార్గమును బోధించుటచేతను ఆముగ్గురే ముఖ్యులగుదురు. ఏకాలమందును వారిని పూజింపవలయును. వారు చెప్పినరీతిగా నడువవలయును.

తల్లిదండ్రుల పూజించు వానికి దేవబ్రాహ్మణ పూజయు పుణ్యస్థల యాత్రయు తీర్థయాత్ర మొదలయిన వానిని చేయకున్నను చేసిన ఫలమిచ్చును. సమస్తపాప విమోచకుడగును. (గరుడ. 11 వ అ.)

క. చెల్లుబడి గలిగి యెవ్వడు
తల్లికి దండ్రికిని దేహ ♦ ధనములు వృత్తుల్
చెల్లింపడట్టి కష్టుడు
ప్రల్లదుడామీద నాత్మ ♦ పలలాశి యగుఁ.

తా. ఏమనుజుడు తనకు సాధ్యమైనంతవరకు తల్లి దండ్రులను పోషింపడో అట్టిమనుజుడు మరణించి యమలోకమునకు బోయినపుడు నాతనితో యముడిట్లనును. నీ దేహమునకు కారణులగు తల్లిదండ్రుల నీవిహలోకంబున పోషించలేదు గాన నీ కిచ్చట దినుట కేమియును లేదు నీ దేహావయవములను గోసికొని వాటిని భక్షింపవలయునని యముండు జెప్పునని శాస్త్రములలో జెప్పి యున్నది. గాన ఆ సికమతావలంబకు లందరు తల్లిదండ్రుల బోషింపవలయును.

## 68. అన్నదమ్ముల విషయములో నడువవలసిన ధర్మము.

క. విను భక్తియు వెరవు గలిగి
యనుజన్ములు పెద్దవాని ♦ నారాధింపఁ
జనవర యతండు దమ్ముల
గొనియాడఁ సిరికి బట్టు ♦ గుమరుజ్జ్వలులై.

క. అనుజుఁడొకడు వొంగలియై
నను దప్పెడు గాని పెద్ద ♦ నకు గార్య జ్ఞా
న నిరూఢి లేక తక్కిన
యనుజన్ములు సిక్కునడుదు ♦ రవనీనాథా.

చ. జనవర యన్నదమ్ములు ప్ర ♦ సన్నమతిఁ గలకల్మి పంచి కు
డ్చిన వినుతించు లోకమును ♦ శ్రీయు బొరింబొరి పెంపునొందు నో

భనిరతి పెద్దకాసపడి ♦ పాడితొరంగిన బ్రాహ్మణగొడ్డువుం
బనులగు నవ్విధంబు మన ♦ పడ్డదిగాదె జగం బెరుంగగన్.

తే,గీ. తండ్రి పిమ్మట నన్నయ ♦ తండ్రి పిన్న
వారలకు నెల్ల నాతని ♦ వనిత తల్లి
తల్లికడ చన్ననని చెప్పి ♦ తాత మరియు
మనుమనికి నిట్టులను నభి ♦ మన్యుపొత్రి.

క. మానవనాయక యగ్రజు
డైనను ననుజన్ముడేని ♦ నన్యాయంబున్
బూని సహోదరులకు గీ
డైన నతడు దండ్యుడందు ♦ రవనీ పతికిన్.

## 69. దేవతల కిచ్చు హవిస్సుల ఫలిత విషయము.

(మార్కండేయ పురాణము.)

సీ. వసుధ నరుల్ హవి ♦ ర్వర్షణంబుచే నూర్ధ్వ
వర్షులౌదురు జల ♦ వర్షమునను
మన మధోవర్షుల ♦ మనబడుదుము నిత్య
నైమిత్తికములనే ♦ నరులు మనకు
సంతుష్టి జేసెదు ♦ జన్నంబులను మాని
వారి భుజింతురో ♦ వారి దుష్ట
బుద్ధుల నాశంబు ♦ బొందింప క్షితిజలా
నలవాయువుల నతి ♦ కలుషములుగ

గీ. జేసి దోషంబులను గల్గ ♦ జేతుమంత
మనుజులాదుష్టతోయాదు ♦ లనుభవింతు
రందునను మృత్యుహేతువు ♦ లగు నుపద్ర
వంబులను బొందెదరు స్వపా ♦ పంబునలన.

కం. మనలఁగ హవ్యంబులచే
దనిపి యెవరు శేషమునను దనిసెదరో త
న్మనుజులకు సదన్వయమును
ఘనతర లోకములు నొసఁగి కాతుము కరుణన్.

## 70. నాలుగు వర్ణముల ధర్మములను గురించిన వివరము.

కం. దమమును శౌచము దపమును
శమమును మార్దవము గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరి భక్తియు హ
ర్షము నివి లక్షణము లగ్ర జాతికి నధిపా.

(సప్తమ స్కంధము)

ఉ. శౌర్యము దానశీలము బ్రసాదము నాత్మజయంబు దేజమున్
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థము గామమున్ బుధా
చార్యముకుంద సేవలును సత్కృతియున్ బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబు పృథివీవర శేఖర రాజచిహ్నముల్.

కం. ధర్మార్థకామ వాంఛయు
నిర్మల గురుదేవ విప్ర నివహార్చనముల్
నిర్మద భావము ప్రమదము
కర్మకరత్వములు వైశ్య జన లక్షణముల్.

ఉ. స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశుల
న్మాయలు లేక డాయుటయు మంత్రము చెప్పక పంచయజ్ఞముల్
సేయుటయు న్ధగామరుల సేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియున్ మనుజనాథ యెఱుంగుము శూద్రధర్మముల్

తే. ఎట్టి వర్ణాశ్రమంబుల నెట్టి ధర్మ
మితరి శాస్త్రోక్తమైయుండు విడువ కెపుడు

నియతి దాని ననుష్ఠించు ♦ నిపుణమతులు
దక్క నొరులచ్యుతు భజింప ♦ దగరు సుంత.

గీ. స్వకులవృత్తిని జీవింప ♦ శక్తుడయ్యు
నన్యధర్మంబు పూనుట ♦ నగును వృత్తి
సంకరంబిది గావున ♦ సకల జనులు
గడగి నిజవృత్తి వదలక ♦ నడువవలయు.

(విష్ణుపురాణము.)

71. చతురాశ్రమముల విషయము. (అశ్వమేధపర్వము.)

సీ. గురునకు బ్రియహిత ♦ కరుడయి వేదాధ్య
యన మొనరించుచు ♦ నశనమమల
భిక్ష నొనర్చుచు ♦ బిల్వపలాశ దం
డములలో నొకటి ధా ♦ ర్యముగ జేసి
స్నానశీలుడు బ్రహ్మ ♦ చర్యపరుండును
నియతేంద్రియుండును ♦ నిత్యశుచియు
యజ్ఞోపవీతియు ♦ నబహుభాషియు మేఖ
లాఢ్యుండు నైశయ ♦ నాసన ప్ర

గీ. చార విధములు సముచితా ♦ చరితములుగ
సత్యధర్మ నిరూఢుడై ♦ శాంతి గలిగి
వేళ్ల్మియిరుపొద్దు నడపుచు ♦ గల్మమంపు
బనుల కొలయక వర్తించు ♦ బ్రహ్మచారి.

సీ. అర్హప్రకార స ♦ మావర్తనుండయి
నిజదార నిరతుండు ♦ నిర్మలప్ర
చారుండు పంచయ ♦ జ్ఞపరుండు నతిథిశి
ష్టాశియు శుక్లవ ♦ స్త్రాన్వితుండు

శక్త్యము గుణాధాన ♦ శాలియు నచపలేం
ద్రియుడును శుచియు నై ♦ ప్రీపరుడును
స్వాధ్యాయశీలుండు ♦ సద్వ్రత నిష్ఠుండు
నై యాజనంబు న ♦ ధ్యాపనంబు

గీ. శక్యమయిన సల్పి ♦ క్షమగల్గి సత్ప్రతి
గ్రహా మొనర్చి [illegible] ♦ లహితులనక
మాటకార్యముసను ♦ మధ్యస్థుడై గృహ
స్థుండు నడచు దురిత ♦ దూరు డగుచు.

సీ. గ్రామంబు దొలగి యా ♦ రణ్య స్థలంబున
బర్ణశాలావాస ♦ పరత నొంది
స్నానతంత్రము రెండు ♦ సంధ్యల నడుపుచు
బ్రహ్మచర్య వ్రత ♦ భాషియగుచు
బూరిపంటలు ఫలం ♦ బులు మూలములు శాక,
సముదయంబును నశ ♦ నముగ గొనుచు
నజినంబువల్క ల ♦ మంబరంబుగ గొని
శయన కృత్యంబు భూ ♦ స్థలి నొనర్చి

గీ. యతిథులకు నెపమిచ్చి యా ♦ హారములను
భక్తినాత్మీయములలోన ♦ బంచిపెట్టి
యధ్యయన హోమశీలుడై ♦ యన్ని యింద్రి
యముల గెలచి వానప్రస్థు ♦ డతిశయిల్లు.

సీ. సర్వభూతదయాను ♦ షంగంబు గలిగి యా
శీత వస్తువుల ఛిం ♦ తింపకెదన
నాగతంబులమీద ♦ నాశసేయక వర్త
మానలబ్ధము లుపే ♦ క్షానిరూఢి
గాచర్మ ఛేదములను ♦ గామకర్మ మెట్లట్ల యిం
ద్రియములలోనికి ♦ దిగిచికొనుచు

సముచితకాల భి ♦ క్షాచర్య దొరకొన్న
యంతన నిజదేహ ♦ యాత్ర నడపి

గీ. గ్రాసమాచ్ఛాదనంబు ద ♦ క్కంగ నెవ్వ
డర్థి నెయ్యది యిచ్చిన ♦ నందనేక
వారభోజి యగుచు నమ ♦ స్కార సఖ్య
మతి నిరాకృతి రహితుడై ♦ యతి

క. అనసూయయు నక్రోధం
బును దమమును బ్రహ్మచర్య ♦ మును ఋజు భావం
బును సత్యంబు నపైశున
ము నహింసయు జూవె యతికి ♦ ముఖ్య వ్రతముల్.

గీ. వృక్షమూల నదీతీర ♦ విజననిలయ
విపినగిరి గుహా నిత్య వి ♦ విక్త శేవ
సదనవాసియై కౌటిల్య ♦ సాధ్యవస్తు
సంచయనము లుడిగి యతి ♦ సంచరించు.

క. తనమేలు ప్రకాశింపక
తనుగనుగొనునట్టి జనులు ♦ దాసీనతమై
నునికికిదగియెడు చందం
బున వర్తించు యతి సర్వ ♦ ముక్తత నొందుణ్.

అశ్వమేధపర్వము. (అవ్యక్తనామ తత్వనిరూపణములో.)

---

72. ఆశ్రమములలో శ్రేష్ఠము. (కర్మయోగ శాస్త్రములో.)

---

వ. బౌధాయనాపస్తంబులు గృహస్థాశ్రమమె ముఖ్యమైన దని యు దానిచే నమృతత్వము ప్రాప్తియగుననియు స్పష్టముగ విధించిరి. బౌధాయన సూత్రమున "జాయమానోవై బ్రాహ్మణః త్రిభి ర్ఋణవాన్ జాయతే" ప్రతి బ్రాహ్మణుమను జన్మ మొదలుకొని

మూడు ఋణములను తన వీపుపై వైచుకొని వచ్చినాడు అనునది మొదలుగాగల తైత్తిరీయ సంహితయందున్న వచనములను మొదట చెప్పి యనంతర మీ ఋణముల దీర్చుకొనుట కొరకు యజ్ఞయాగాది పూర్వకముగ గృహస్థాశ్రమము నాశ్రయించు మనుజుడు బ్రహ్మలోకము నొందుచున్నాడనియు బ్రహ్మచర్యముగాని సన్యాసమునుగాని ప్రశంసించు మనుజులు దుమ్ములో గలసిపోదురనియు జెప్పబడినది.

(బౌ ౧, ౬, ౧౧, 33 మరియు 34) మరియు నాపస్తంబ సూత్రమందును నవి యటులే విధింపబడి యున్నది. (ఆప ౨, ౯, ౨౪, ౮) ఈ రెండు ధర్మ సూత్రములలోను సన్యాసాశ్రమము వర్ణింపబడక పోలేదు. దానిని వర్ణించినను గృహస్థాశ్రమము యొక్క మాహాత్మ్య మధికమైనదని చెప్పబడినది. దీనివలనను విశేషముగ మనుస్మృతియందును కర్మయోగమునకు "వైదిక" మని విశేషణ మిచ్చుటచేతను కర్మత్యాగాను రూపమగు సన్యాసాశ్రమముకంటె నిష్కామకర్మయోగమైన గృహస్థాశ్రమము మనుస్మృతి యొక్క కాలము కంటెను ప్రాచీనమని తెలియుచున్నది. మరియు, కలియుగమందు సన్యాసాశ్రమము నిషేధింపబడినది.



## 73. రాజుయొక్కయు ప్రజలయొక్కయు అన్యోన్య ధర్మము.

క. రాజునకు ప్రజశరీరము
రాజు ప్రజకు నాత్మగాన ♦ రాజును ప్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు ♦ రక్షార్చనలన్. భారతము.

క. తనవారు పెద్దసేయని
మనుజేశుని రాష్ట్రజనులు ♦ మదిని సరకు గా

గొనరది భూప్రజకొప్పదు
విను కావున బతికి ప్రజలు ♦ వెఱచుట యొప్పఁగా.

చ. అతడును మందహాస సహి ♦ తాలపనంబును సత్యభాషణ
వ్రతమును సంవిభాగ నిర ♦ వద్యతయుఁగా సమభావముఁగా గృత
జ్ఞతయు జితేంద్రియత్వము బ్ర ♦ సాద ఫలంబును గల్గి భూమికిం
బిత్రుసముఁడై విరోధి జన ♦ భీషణ సారతనొప్ప బెంపగుఁగా.
(శాంతి పర్వము. రాష్ట్రిపసులకు అర్థాధర్మము చెప్పుటలో.)

వ. ఆంగీరస భార్గవాదులగు పెద్ద లిట్లని చెప్పిరి. శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వాఘ్రాణంబులును వాక్పాణిపాద పాయూపస్థలును కర్మేంద్రియంబులును మనంబునుం గూడ జయించి కామజంబులగు నక్ష మృగయాస్త్రీపానార్థదూషణంబులను గ్రోధజంబులగు వాక్పారుష్య దండపారుష్యంబులను సప్తవ్యసనంబులం దగులక దుర్మంత్రిల కుటిల వాక్యంబులకు లోనుగాక యవిక్రమ క్రమజ్ఞులైన యమాత్యులతో దేవమానుష చింతనంబు చేయుచు యశుభనిరాసంబును శుభాపాదనంబును నొనర్చుచు బ్రజలం బాలించు భూపతి యుభయ లోకసిద్ధులం బొందు.
(శాంతి. బృహస్పతి వసుమనస్సను రాజునకు చెప్పు రాజనీతిలో.)

గీ. పరిజల నౌరస పుత్రుల ♦ పగిది బ్రోచు
చును సమస్తాధ్వరముల వి ♦ శుద్ధమతిని
పూర్ణ దక్షిణ లిచ్చి య ♦ పూర్వ రీతి
జేసె ఋత్విక్పురోహిత ♦ చిత్తశత.
(మార్కండేయము. మరుత్తు చరిత్రలో.)

## 74. కృతఘ్నత విషయము.

---

### 1. మేలు చేసిన వాని కపకారము చేయుట.

2\. మేలు చేయుచుండు తరిసే అపకారము చేయుటయు కృతఘ్నత యనబడును.

(భారతము. నాళీజంఘుని చరిత్ర చెప్పుటలో.)

వ. నైమిశారణ్యంబున నాళీజంఘుండను నొక బకంబొక వట వృక్షమును నాశ్రయించి యుండెను. అచటికొకనాడు ధనాశాపీడి తుండగు నొక బ్రాహ్మణుండు రాగా నాబకంబతని జూచి గార వించి యతని మిత్రుండగు విరూపాక్షునిచే నతనికి కావలసిన ధనం బిప్పించె. అంత నాబ్రాహ్మణుండు నాళీజంఘుండను బకంబతనికి చేసిన మేలును మరచి నాళీజంఘుండు నిద్రబోయెడు సమయంబున నతనిజంపి తన్మాంసంబు భక్షించెను. తదుపరి నాళీజంఘుని మిత్రుం డగు విరూపాక్షుం డీసంగతి తెలుసుకొని యా విప్రుని జంపించి యాతని శరీరమును బార వేయుగా నట్టి కృతఘ్నుని శరీరంబు శునకం బులు కూడ తిననొల్లవయ్యె.

క. వెడశంఠ నెత్తుకొలుకం
బడదోచిన వచ్చి కుక్క ♦ పడుపు వెనుకకుగా
జడిసె గబళింప నొల్లక
కడుపులు నకనక పడంగ ♦ గౌరవ ముఖ్యా.

వ. అని భీష్ముండు.

క. విను మధి యట్టిద కుక్కలు
దినగా రోయును గృతఘ్ను ♦ దేహము మాంసం
బని చెప్ప నాగమంబులు
మనుజేశ్వర తెల్లమయ్యె ♦ మానక చ్చోటగా.

అని పలికి వెండియు నిట్లనియె.

క. అరయ మిత్ర ద్రోహము
దారుణము పాతకము కృతఘ్నతకంటె
న్నైరముగాని యెముమములయు
న్నాదెంచు దెఱగు వారి ♦ వాల్మ్యనై నదే.

## 75. ముఖ్యమైన యజ్ఞములు.

---

చ. వినుము ప్రభూతదానములు ♦ విశ్రుత యజ్ఞములుం సధర్మతా
వినుతికి నెక్కుజాలవు వి ♦ వేకనిధీ పరిశుద్ధశోభితా
ర్జనమున దెచ్చుకున్నది ది ♦ రంబగు పాత్రము నర్హకాలముం
గని లఘువస్తువేని నొస ♦ గంగడునుజ్జ్వల ధర్మమారయుం.

(అశ్వమేధ పర్వములో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుండు సకుటుంబముతో బ్రహ్మలోకమునకు బోవుటలో.)

క. విను పశుయజ్ఞము హింసన
మనంతఫలదంబుగా ద ♦ హంకృతి సహితం
బనఘా వాఙ్మన సమయం
బను యాగంబిచ్చు నవ్య ♦ యానందంబుం. (శాంII పII)

గీ. వివిధ సంకల్పయజ్ఞము ♦ ల్విడిచి యాత్మ
యందు నిష్టమై నగ్ని స ♦ మాహితముగ
జేసి నిస్పృహుడై విష్ణు ♦ చిత్తవృత్తి
చేర్చువాడవ్యయస్థితి ♦ జెందనేర్చు. (అనుశాసనీకము.)

క. యజ్ఞంబులలోన తప
యజ్ఞంబుత్తమము దాని ♦ నాదరణమునం
బ్రాహ్మోత్తమ వేద్యము స
ర్వజ్ఞుడు ప్రీతుడగు శాంత ♦ రసమొప్పు జుమీ.
(అశ్వమేధపర్వము.)

గీ. పరము డీశ్వరుండు ♦ బ్రాహ్మణ ముఖమున
నాహరించి తుష్టు ♦ డైన భంగి
నగ్ని ముఖమునందు ♦ హవ్యరాసులు గొని
తాను తుష్టినొంద ♦ డనఘ చరిత. (భాగవతము)

సీ. అమరాధిపతి తొల్లి ♦ యాగంబు సేయంగ
దొడగ మహాముని ♦ స్తోమములును
సురసంఘములు గూడి ♦ కురుముఖ్య ఋత్విగ్గ
ణముల నేర్పరచి సొం ♦ పమర వేది
గల్పించి తగ నగ్ని ♦ కార్యంబు నడపంగ
నర్హాలు పశునిచ ♦ యంబు దేర
నమ్మును గ్లనుగొని ♦ యధిక కరుణార్ద్రంబు
లగు చిత్తములతోడ ♦ నమ్మహేంద్రు
గీ. నాననంబు జూచి ♦ యక్కట హింస ధ
ర్మంబుగాదు కృతయు ♦ గంబు సొచ్చె
ననఘ వత్సరత్ర ♦ యము ప్రాతలయిన బీ
జంబు లిపుడు యజన ♦ సాధనములు. (అశ్వమేధపర్వము)

మరియు నగస్త్యులవారు హింస రహితంబుగా జన్నము చేసి నట్టు లున్నది. (అశ్వమేధం చివరను.)

శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్। జ్ఞానయజ్ఞఃపరంతప
సర్వం కర్మాఖిలంపార్థ। జ్ఞానేపరిసమాప్యతే॥ భగవద్గీత॥

తా. ద్రవ్యమయమగు యజ్ఞము కంటె జ్ఞానము శ్రేష్ఠము. సమస్తమైన కర్మములు జ్ఞానముచేత పూర్తియగును.
(అశ్వమేధపర్వంబున.)

వ. ధర్మరాజుయొక్క అశ్వమేధయాగ సమయమున విస్మయంబు చేయజాలునట్టిది యేమని గలిగెనేని వినవలతునని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె.

క. ఆ మఖమున బ్రాహ్మణ ధవలా
ధమ్మున భూమి గల యట్టి ♦ బ్రాహ్మణు లెల్లన్
వమ్మొనర కుండ హాయము
ధమ్మజ్వలభంగి నొప్పె ♦ దత్సమయమునన్.

గీ. అఖిల జనములు నన్నెరు ♦ వొంద ధర్మ
నందనుని మానసమున నా ♦ నంద మొలయ
నతనిపై మకరంద ధా ♦ రాభిశోభి
కుసుమ వర్షంబు పెల్లుగ ♦ గురిసె నధిప.

వ. అట్టియెడ.

సీ. ఒక్కబిలంబున ♦ నుండి వెల్వడి యొక్క
నకులంబు విప్రజ ♦ నంబు నడుమ
నిలచి సకృపస్థు ♦ నలసు ధర్మంబు నే
మియుబోలదీ యశ్వ ♦ మేధమనిన
నవ్విప్రు లతి విస్మ ♦ యంబంది యమ్ముంగి
గన్గొని మంత్ర వ ♦ ర్తనము దంత్ర
గమనికయును వివి ♦ ధములైన దానవి
ధులు బహుళత్యాగ ♦ ములును లోక

గీ. సంస్తుతములయ్యె భక్తియు ♦ శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురము ని ♦ హర్షమావ
హిల్లజేసె నీ వేమిట ♦ నిమ్మహాధ్వ
రంబు గీడంటి చెప్పుము ♦ పరిస్ఫుటముగ.

వ. అనుటయు నన్నకులంబు వారల కిట్లనియె. కురుక్షేత్ర మున రోషకామవిరహితుండగు నొక మహాద్విజుండు ఉంఛవృత్తిచే దానును భార్యయు కొడుకును కోడలియు నలువురు జీవించుచుండ ననావృష్టిదోషమావహిల్లె. అట్టియెడ ఆహార మొనర జేసుకొను టకు కఠినమై చెల్లుచుండ నొక దినంబు నతిథి యొక్క ధరామరుం డరుగుదెంచిన ప్రియంబున వారెదుర్కొని బర్ణశాలాభ్యంతరమున కతని దోడుకొనిపోయి యాసనస్థునిగ జేసి అడుగులు గడిగి ప్రీతియె సలారగ దద్దయు నెమ్మిబల్కి తనపాలి సక్తువు నొసంగిన దాని నతడు తృప్తిబొందకునికి యేమిట నితండు తృప్తుడగు నెట్లు సేయు దునొకో యను విచారంబు బొడమ దదీయ భార్య తదింగితంబూ

పాత్రలములు భృంగములు గలిమి యున్న సంయమివరుఁడిట్లు యతిథికి నచ్చెరువు పాలి సక్తువు నిచ్చె.

ఉ. ఇచ్చిన బ్రీతి పుచ్చుకొని ♦ యింపెసలార భుజించి తృప్తిమై
నచ్చెరువడంగ మెచ్చు నమ్ము ♦ ఖాంబురుహాంబలరంగ నిట్లనుం
బొచ్చెము లేక యయ్యతిథి ♦ భూరిగుణోత్తమ నిన్ను జూడగా
వచ్చితి నేను ధర్ముడ భ ♦ వద్వ్రతశీలత జూచి మెచ్చితిన్.

క. భక్తియు వినయము శ్రద్ధా
యుక్తియునుం దాల్మితోడి ♦ యొప్పను గరుణా
సక్తియు నతిథులయెడ నను
రక్తియు నీయందు సుస్థి ♦ రత్వము బొందెన్.

క. నీదానంబున విస్మితు
లై దైవత యక్షసిద్ధ ♦ లభివర్ణన మ
త్యాదరమున జేసెదరిదె
రోదసి సమ్మర్దముగ న ♦ రుగుదెంచి దగన్.

క. అని చూపి పల్కె నవసర
మున బర్జన్యుండు గురిసె ♦ బుష్పాసారం
బనవద్యహృద్యనాదం
బున మ్రోసెను దేవదుందు ♦ భులు గగనమునన్.

వ. అప్పుడయ్యతిథి వెండియు.

క. నిను జూచువేడ్క నేవ్వారు
మునుల మనంబుల సమ్మగ ♦ ముగ గదిరెందు న
జ్జన కీర్తనీయ దివికిం
జను దెమ్ము ప్రియాసుతస్ను ♦ షా సహితముగన్.

క. తగు ప్రియమున సకుటుంబం
బుగ దన సభకేవురాక ♦ బుద్ధింగని బ్ర

హ్మా గడున్నేడ్క విమానం
బు గురువ్రతశీల శీఘ్రి ♦ మున బుత్తెంచుఁ౯.

క. అని పలుకుచు దివ్యంబగు
తన యాకారంబు చూపె ♦ ధర్ముండు గన
త్కనకమణిమయ విమానము
వినువీధిం దోఁచె మునులు ♦ విస్మయమందః.

వ. అప్పుడు ధర్మదేవత యతనితో.

క. వేడుక నాలుం గొడుకును
గోడలు నీవును ప్రభూత ♦ గుణ యెక్కుడు సం
క్రీడ మెయి నీవిమానము
నీడితగతి బ్రహ్మ సభకు ♦ నేగగవలయుఁ౯.

క. అనవుడు సక్తు ప్రస్థుడు
తనవారును దాను నెక్కి ♦ ధర్ముండనుపం
జనియె నది యంతయును నే
గనుగొనుచు బిలంబు వెడల ♦ గా నామేనఁ౯.

వ. ఆసక్తువు గంధంబును నతిథిపాద్యజలక్లేదంబును బొరసి సక్తుప్రస్థకృతంబైన పరమ ధర్మంబు మహిమం జేసి మదీయ సక్తంబును నొక్కపార్శ్వంబును గనకమయంబులయ్యె నాడు దొడంగి యేను దానవిధి స్థలంబులకుం బుణ్యాశ్రమ భూములకును వివిధాధ్వర ప్రదేశంబులకుం జనుచుండుదు. దక్కటి ప్రక్కపసిండి యగు నను తలంపున నన్ని చోట్లకుం బోయిపోయి కానకుండి లోకోత్తర చరితుం డజాతశత్రుం డశ్వమేధంబు సేయుచున్నవాడయ్యెడ నాకోర్కి సిద్ధించునని పెద్దయు నాసతో సరుగుదెంచితి నించుక విశేషంబునుం గాన వినుండది కారణంబుగా నయ్యుంఛ వృత్తివిప్రుని ధర్మంబునకు నీయజ్ఞంబు బోలదంటిననిపలికి యన్నకులంబు నెక్కడ బోవులయు నెఱుంగకుండంబోయె. ననిన విని జనమేజయుండు అవనీశ్వరులు

దొల్లి యాగకృతుల నతుల కీర్తులను సద్గతులను బడసిరి. ధర్మనందను డయ్యుదాత్తభంగి దొంటి భూనాథులకంటె సత్యంబున శౌచంబునను భక్తి శ్రద్ధ నీగి నతిశయిల్లె. వేదవ్యాసుడాదిగాగ నార్యజనుల చిత్తంబులకు నెక్కు నమరవల్లభు చందమందముగ జేసె నశ్వమేధంబు మెచ్చులకాకరముగ నట్టి జన్నం బా నకులంబుచేత గర్హితంబగుటకు గారణం బేమి యని యడిగిన వైశంపాయనుండు ధర్మపుత్రి నధ్వరంబు నీచెప్పిన యట్టిద యైనను నొక్కటి చెప్పెద నవహితుండవై విను మన్నకులంబు హింసాత్మకంబైన పశుయజ్ఞంబులకంటె నహింసాభిమతంబైన తపోయజనం బధికంబని చెప్పిన యదియయ్యె. ఇంత చెప్పుటకు గాక తనశరీరంబున శరీరార్థ సువర్ణమయంబైన కతంబునుం బలికెంగాన దాని వచనంబు దోషపువడదు.

---

పరిథమ భాగము.

సంపూర్ణము.



